జంకక, సదుత్తరం బీయఁజాలని సభ యుండిన నేమి లేకుండిన నేమి? పెద్దలయెదుటఁ చిఱుతవాఁడు ధర్మనిర్ణయముఁ జేయుట యధర్మమయినను అన్యాయశ్రవణవికర్ణుండయిన వికర్ణుఁడు నిర్ణయింపఁబోవు ధర్మము కామక్రోధంబులు దక్క విచారింపుఁడు. జూదమ్మును, వేటయు, పానమ్మును, బహుభక్షణాసక్తియు, నను నాలుగు దుర్వ్యసనంబులం దగిలిన పురుషుండు ధర్మముదప్పి వర్తిల్లును. అట్టివాని కృత్యంబులు చేకొనఁ దగినవి కావు. కితవాహూతుండై దుర్వ్యసనాసక్తుండగు పాండవాగ్రజుండు పాండవుల కందఱకు సాధారణధనంబయిన పాంచాలి బణంబు వెట్టుటకు స్వతంత్రత గలిగియుండునా? అస్వతంత్రునిచేఁ జేయంబడు కార్యము న్యాయస్థానమునందు నిర్వహింపఁ గలదా? ద్రౌపది యధర్మవిజిత; మఱియు నేకవస్త్ర. అంతఃపుర వాసిని కావున, నిట కీవిధంబునఁ దోడ్కొనివచ్చుట న్యాయముకాదు. అయ్యది సభాసదు లెఱుంగనిదియా?

ఉ. ఎందుకు మీతసంబు జప ♦ మెందుకుఁ నిష్ఠలు యోగ మెందుకో
ఎందుకొ ధర్మశాస్త్రము ల ♦ దేపనిగా పఠియించు టార్తిమై
గుందుచు ధర్మసంశయము ♦ గోరిన సాధ్వికి నుత్తరం బిడం
దందరలాను పండితుల ♦ తండము లుండిన మంద నేమియా.

పిదపకాలము గావున, మీర లుపేక్షించియుండవచ్చును. ముఖ్యముగ నాసేయు ధర్మనిర్ణయ మిదియ. పాండవాగ్రజుండు పాండవుల కందఱకు సాధారణధనంబయిన పాంచాలిని పణంబుఁ జేసెఁగావున, ద్రౌపది యధర్మవిజిత, యామె మఱి నేకవస్త్ర నిట దోడ్కొనివచ్చుట యన్యాయంబు. ఇదియ నాసేయు ధర్మనిర్ణయంబు.

సభ్యులు—సత్యము, సత్యము, సత్యము. (చప్పటులు గొట్టవలయును.)

కర్ణ—(ఈర్ష్యతో) ఆహా! ఏమి యీవిలాసము, ఏమిగోల, ఎందుకీచప్పటులు, ఎందుకీకేకలు? తెలిసి తెలియని పసిపిల్లని పలుకుల కింత సంభ్రమమేల? అఖిలశాస్త్రములు పారజదివిన పండితులకన్ననో యవివేకీ! నీ కెక్కువ తెలియునా? నిన్న మొన్న కన్నుదెరచిన నీవు, ధర్మవేత్తలవడుమ చక్కఁగ దిద్దుపాటి శక్తి నీ కెక్కడనుండి వచ్చినది! పెద్దలచే నిండియున్న సభలో నీకింత గర్వము స్వతంత్రము పనికిరాదు. నాలుగునీతులు వల్లించినంతమాత్రముననే పేరుప్రతిష్ఠలు కలుగునా? నీ వొక న్యాయవేత్తవగుదువా? ద్రౌపది యధర్మవిజిత యంటివి. నీ కేమి తెలిసి పలికితివి? ధర్మజుఁడు తన సర్వస్వమును నొడ్డి యోటువడిన నీమె వానికి చెలిగాదు? కావుననే ధర్మవిజిత. ఇట్లు కానినాఁడీ పాండవు లందఱు, విజితిగ నేల యొడంబడుదురు? మఱియు నేకవస్త్రయైయున్నఁ దీనిఁ గొనివచ్చుట యధర్మంబనిగదా యంటివి? లోకంబున నాఁడుదానికి దైవాధిష్ఠితుండగు భర్త యొక్కఁడుండును, గాని పలువు రుండరు. దీనికి ననేకమంది భర్త లుండుటచేత, బంధకి యనంబడు. ఇట్టిదాని నేకవస్త్రయనన నేల, విగతవస్త్రఁ జేసి తెచ్చినను ధర్మవిరోధంబు లేదు. ఓయి గర్వపోతా! తనకు లేని యధికారము మీఁద వేసికొని గాలిగానివలె వాదువడుట తప్ప నీకుం గలుగు కీర్తి లేదు. ఇది మొదలు లేనిపోని పెత్తనంబులు పైవేసికొనక, యొక మూల నొదిగియుండుము.

మఱియు నిప్పటికి మించినది లేదు. ఈ భీముండు ధర్మరాజు శమ కధికారి కాఁడు, ఈతఁ డొడ్డినపందెము మే మంగీకరింపము అనినఁ జాలును ద్రౌపదినే కాదు, పాండవు లందఱినిగూడ దాస్యమునుండి విముక్తులఁ జేసెదను. ఇప్పటి భీమార్జునుల సంవాదముచే విజితగా దాని భర్తలే యొప్పుకొనుచుండ నీకీ వ్యర్థప్రలాపము లెందుకు? నీచేతనయిన భీమునిచే నామాట ననిపింపుము.

భీము...ఓరి పరదత్తాన్నభోజనమత్త! కురుపాండవకలహానలతికాలవాల! అవిదితనిజబలపరాక్రమపౌరుష! సూతకులగాఢబడబానల! వాయుపుత్త్రక యొక్క మూల పడియుండక మాయాద్యూతసమాగతవిజయంబుగూడ విజయంబుగాఁ దలఁచి న్యాయవాదియగు వికర్ణుని నిందించుటయే కాక, భీముఁడు ధర్మజాజ్ఞాబద్ధుండు కా, డనవలయునా? అట్లనిపించవలయునా? ఈ భీముఁడు ధర్మజాజ్ఞార్గళబంధీకృతప్రాణి కానిచో నీపాటికి మీ శిరంబులు పప్పుపప్పుగ, నలినలిగా, గ్రుద్దుగ్రుద్దున పగులకపోయినవియా? ఈ సభారంగము శ్మశానవాటిగా మారకపోయినదియా? మీ యాండ్రు తలలు విరియబోసికొని, నీలిచీరెలు ధరించి, నదీతీరంబున కేగి మంగళసూత్రంబులు పెటపెట, పెటపెట, త్రెంచుకొను శుభముహూర్తము సమీపించకపోయినదా? ఓరి దుష్టదాంభిక! యీ సోదరులు నలువురు యుధిష్ఠిరాజ్ఞాబంధీకృతప్రాణులురా! ఈ ధర్మదేవత మమ్ము ద్యూతమాత్రమున పందెము పెట్టుట కాదు. మా శిరంబులు గోసి యిచ్చుటకుఁగూడ సంపూర్ణాధికారిగా నొప్పుకొనియుంటిమని. తెలిసికొని చచ్చినట్లు పడియుందుము. ఓరి దరిద్ర దామోదర! కోఁడులకడ తప్పన లుచ్చరించి పెంపుడు కుక్కవలె భోజనపరిత్యక్తాన్నకబళ విమోహితప్రాణివగు నీవుగూడ సభలో ధర్మసంశయవిచారణకర్తవగుట భావికలికాలపు చిహ్నములని తలంపవలయు. అగ్రజాజ్ఞాపాశబద్ధుండు భీముని వ్యర్థునిగాఁ దలంచి కాలు లరవక, తల వంచుకొని కూర్చుండుము.

కర్ణ—పౌరుషహీనుండు వాగ్వ్యాపారముచే శూరుఁడ నగుదునని తలంచు నీవంటి యసమర్థుల మాటలకు నుత్తరంబు లొసంగఁబూనుట మావంటి శూరశిఖామణులకు నిశ్చయముగాఁ దలవంపులే, కావున, పెండ్లామును జూదంబునందు నోడిపోయిన పౌరుషహీనుల మా ప్రారబ్ధవశంబునఁ జూడవలసివచ్చినప్పుడు మీ మోములఁ జూచి యఘంబు పొందుటకన్న తలవంచుకొని కూర్చుండుట సంతోషము.

ద్రౌప—ఏకవస్త్రను, పతివ్రతను నిట్లు నిండుసభను నిలువఁబెట్టి, నా ప్రశ్నమున కొక్కరును జవాబీయకుండుట పాడియా? అవిజితనగు నన్నిట్లు చేయుట సర్వ సంపదలు నశించుననని, యించుకైన భీతి వలదా? మాయాద్యూతంబున నోడుచుకొనఁ బడితినని, రచ్చ కీడ్చించుట సార్వభౌములకు మర్యాదా? నాయనా! దుర్యోధనా! నేను దాస్యము చేయుట మూవశ్యమని తోఁచినదా? భూపాలా! నీకు గాంధారి యొక్కటియే, నే నొకటియునా? నాకు పరాభవము ఘటియింపఁజేసిన, నీకు వధూనికను కాక పోవుదునా? ఈర్ష్యామాయాలోభంబులు, రాజులకు క్షేమము కాదు. కావున మత్సర గ్రస్తుండవై, మానవతీపరాభవకార్యములొనర్ప యత్నింపకుము. ఈ కార్య మపకీర్తి నీకు గొసఁగించునని తలంచుము. నన్ను విడిచిపుచ్చుము.

దుర్యో — ఓసి దాసీ! నిన్ను ధర్మోపన్యాసము లొనర్చుటకుగాఁ బిలుచుకొని రాలేదు. వారియొత్తిక యూడిగ మొనర్పుము. రాజును నిందించకుము. ప్రభునిందకులు, రాజద్రోహశిక్షకుఁ బాత్రులగుదురని తెలిసికొనుము. న్యాయాన్యాయములు విచారించు తెలివి నీపాటి యొవరికి లేదని విఱ్ఱవీగకుము. నీ గ్రహచారము చాలక ద్యూతమున నిన్ను పందెముపెట్టి యోడిపోవు మగలు దొరికినందులకు విచారపడుము. మఱియు నిట్టి దుస్థితి నీ కెన్నటికిని గలుగకుండఁ జేయుమని దేవునిపైఁ బడి యేడ్వుము. మమ్ములఁ దిట్టకుము. శ్లో. అసంతుష్టా ద్విజా నష్టా సంతుష్ట ఇవపార్థివః॥ అనఁగ దొరికి నంతటితో తృప్తి నొందియుండుట బ్రాహ్మణోత్తములకుఁ జెల్లును గాని, రాజులకు మాత్రము శత్రువిజయమందు తృప్తికూడదని నీతిశాస్త్రజ్ఞులు శాసించుచున్నారు. కావున శత్రువిజయమునకై పాటుబడు మమ్ములఁ దిరస్కరించిన దండనార్హురాల వగుదువు. యోచించి మాటాడుము.

విదు — పండితోత్తములారా! యీయమ పలుమారు దీనయై వేడుకొను ప్రశ్నంబున కుత్తరం బొసంగక, చూచుచుండెదరేల? నా న్యాయంబు వినుండు. తొల్లి విరోచనసుధన్వులను బాలు రిరువురు కలరు. వా రొక్కకన్నియం బరిణయం బాడఁ గోరి, తమలోఁ దాము, విద్యలయం దొకరికంటె నొకరధికుల మని పెనఁగులాడి, యందులకు దమ ప్రాణంబులు పందియంబులుగాఁ గొని యీ వివాద మపనయించుటకయి ఆంగీరసపుత్రుం డగు సుధన్వుండును, విరోచనుని తండ్రియగు ప్రహ్లాదుని కడకుం జనిరి. అప్పుడు ప్రహ్లాదుఁడు మాధ్యస్థుఁడై వా రిరువురినిఁ బరిశీలించి, న్యాయమునకు భంగము కలుగకుండ, తన కుమారునికంటె సుధన్వుఁడే విద్యాధికుడని నిష్పక్షపాతంబుగఁ బలికె. సుధన్వుండు కుమారునియందు ప్రేమయైన లేక, న్యాయంబుగ విమర్శించి పలికినందుకు సంతసించి విరోచనునకు ప్రాణదాన మొసంగి చనియెను. కావున మీర లొకని దయకు భంగము కలుగునని జంకక, ద్రౌపది ప్రశ్నంబుల కుత్తర మొసంగ యత్నింపుడు. శకునిచేసిన ప్రోత్సాహంబున ద్రౌపదిని పందెము పెట్టుటకు ముందు, ధర్మజుండు పందెమొడ్డుకొని యోడిపోయెఁ గాన నప్పటికి దానొక్క దాసుండు, అట్టిదాసునకు పరంపడి మహారాణి యగు ద్రౌపదిని పందియంబు పెట్టునంతటి యధికార మెక్కడనుండి వచ్చినది? కావున ద్రౌపది ద్యూతవిజిత కాదు. ఆమె దాస్యంబునకుం దగదు. ఇది నానిర్ణయంబు. మఱియు సాధ్వీపరాభవము రాజులకు ముఖ్యముగాఁ గూడనిపని యని యోచించుఁడు.

దుశ్శా... ఓయి విదురా! స్వజనాన్యత్యాసక్తచిత్త! మూఢ! ఇప్పుడు భీముండు పలికిన పలుకులు వినుటకుఁ జెవులు లేకపోయినవా? న్యాయమని దానిమగండే యంగీకరించు యువతీకాంతగవ్వాస్యచర్మపుత్రికాచందంబున నెగురుకొనుచు జక్కట్లు దిద్దుట కేలవచ్చెదవు? ఇట్టిమాట లిఁక పలికిన మాయన్న సహించినను, నేనుమాత్రము మూరకుండఁ జాలను. అది గ్రహించి నాయొత్తకుము. నా సాహసము కనుగొనుము. ద్రౌపదీపాతివ్రత్య మహిమ నగుపఱచెద. (అని ద్రౌపదిపైటను కొంగుపట్టి లాగబోవుచున్నాఁడు).

ద్రౌప — ఆర్యులారా! పండితులారా! దోషజ్ఞులారా! న్యాయవేత్తలారా! ఈయాఁడుకుం దయ్యాళులించుట యన్యాయమని తోచెనా? మీయందలి హృదయములనుండి దయారసంబు పాఱిపోయెనా? అత్రిక్ష్యాజనంబులో నాఁడుబిడ్డలపై కనుపుతీపిగల పుణ్యాత్ముఁ డొక్కఁడైనను లేఁడా? దుర్మార్గుఁ డొక్కప్రాణిని నిష్కారణము హింసించుచుండ న్యాయమిదియని చెప్పఁగల ధైర్యశాలురు లేకపోయిరా? భార్యయన గౌరవింపదగినదని యర్థము తెలియని పరమమూర్ఖులు లేసభాసదులయి నేఁటికి ధర్మదేవత నాలుపాదములు విఱుగఁగొట్టి పడవైచిరా? వయసు చెల్లి తలయు గడ్డము నెఱసి న్యాయవేత్తలమని ధర్మశాస్త్రములు తలక్రిందుగాఁ జదివిన పండితపుంగవు లస్తమించిరా? లోకము గొడ్డుపోయినదా! ధర్మము నశించిపోయినదా? ధైర్యసాహసములు దాచిపెట్టిరా? నీతి బీజంబు లందలి జనగర్భగోళంబులు చవిటిపఱ్ఱలై యంకురంబులు నశించినవా? ఏతండ్రులకైనను, ఏయన్నలకైనను, పుత్రికలును సోదరీరత్నములును లేరా? అంతఃపుర సంరక్షణాభిమానముగల క్షత్రియజాతి మగవారలు భరతదేశము విడనాడిపోయినారా? ఏనాఁడైన నీచజాతియం దుద్భవిల్లిన యాఁడుదానినైన నొక్క దుర్మార్గుఁడు, నరపశువు, మానభంగము సేయుచుండ నిట్లు చూచుచుండిరా? ఆఁడుదానిని పరాభవించుచుండ విలాసముగాఁ జూచుచు నాయుధధారులయి పౌరుషవంతులగు పురుషసింహులు కదలక మెదలక విగ్రహములవలెఁ గూరుచున్న ప్రతిమాప్రతిభాసిత రాజరత్నముల గాంచ నాకడుపు మండుకొనిపోవుచున్నది. క్షత్రియాంగన వరప్రసాదజనిత, జగదేకవీరుండని ఖ్యాతిఁగాంచిన పాండుమహీపాలుని కోడలు, అరిజనకాలగదేరపవమాన సమాన పాండవపంచకపట్టమహిషి, రాజసూయాధ్వరాధ్వర్యు బుజ్జన్మలీకృతవారిధారాపాతపవిత్రీకృతశిరోజ, ధైర్యవీర్యసాహససాలవాల, భర్త్రాజ్ఞానిర్వర్తిత సకలకార్యధురంధర, ఒక్క పౌరుషహీనునిచే, నొక్క దురాగతునిచే, నొక్క నరపశువుచే, నొక్క తృణప్రాయునిచే, స్త్రీ పురుషాదులకుఁ జెప్పుటకు జేయుటకుఁ జూచుటకు [illegible]మై, మహాపాతకమై, ఘోరనరకపాతహేతువగు కష్టమందుచుండఁ జూచుటకీ సభ్యు లంగీకరించుచుండిరి గదా! స్త్రీ యస్వతంత్రి మహానిర్బంధనిగళబంధితయై మానభంగ మందవలసినదియా? లేక యాఁడుది స్వతంత్రించవలసినదియా? పరాభవసమయ సంజాతక్రోధజ్వాలలు, వినిర్గతంబు లగుచున్నవి. లోకంబులు భస్మీభూతలంబులగు కాలంబును, వంశంబులు నశించుకాలంబును, క్షత్రియు లడుగంటు వేళయును, క్షత్రియక్షేత్రంబులు పాడగుకాలంబును, చిరకాలార్జితంబగు రాజవంశమర్యాదాభూరుహంబును భగ్నంబగునదను సమీపించుటచేతనే, మీరందఱు సాధ్వీపరాభవాలోకనకుతూహలుల మయితిమని మీహృదయంబు లొక్కంబుగఁ దలచుఁడు. ఇంక మీకడుపునం బుట్టిన యాఁడుపిల్లలను, కిరాతులు, కొలఁదికాలములో మీయెదుట మానభంగము జేసి, కులభ్రష్టలను జేసి, వారల బలవంతముగ భార్యలఁ జేసికొనుచుండ, నభిమానరహితులయి, పరులకు లొంగి, పరాచారపరాయణులై, పరపాలనాధోగాధంబున గూలి, యధోగతి నొందుకాలము భరతఖండవాసులకు రానున్నదని తలంచుకొనుచుండుఁడు. భారతీయౌన్నత్యము నేఁటితో నేలపాలయినదని మీపంక్తులు తప్పక

యేడ్చియేడ్చి హతు లగుదురని తలంచుఁడు. అయ్యలారా! పరాభవదందహ్యమానులై పీడితులై, లజ్జావిరహితులై, నిరస్తనారీసమానులై, ఆర్యులకు, శూరులకు మర్యాదాభంగములౌ వాక్యములు పలికియుంటిని. నాపై కినుక వహించి దేశవైభవమును, ప్రజాక్షేమంబును, నశింపఁజేయక నాపాపము నన్నే నశింపజేయునని తలంచి నాప్రశ్నల కుత్తరం బొసంగుఁడు. భార్యను పణంబుఁ బెట్టఁదగిన యధికారము నాభర్తకుఁ గలదా! పరిపూర్ణముగా నాపై నధికారమున్నచోఁ దాను రాజుగా నుండి పెట్టెనా? ద్యూతనిర్జితదాసుఁడై నన్ను పణం బిడియెనా? నేను రాణినా; పరపురుషుకత్తెనా? (అని యొక్క క్షణ మూరకుండవలయును.) ఏమి యెవ్వరు పలుకరు? కీర్తిని గడించుటలో గండరగండలై యొకరిని మించియొకరు మునుదంజవేయు ధర్మవేత్తలు, ఆచారపరులు, ధర్మస్వరూపులు, పరాయత్తులయి స్వతంత్రత లేక పుట్టెడు పొట్టకూటి కెక్కడభంగము కలుగునో యని జంకి వంశనాశకుల యాజ్ఞాబద్ధులయి చిత్రప్రతిమలవలె నోరు మెదల్ప లేక సర్వప్రపంచసృష్టికి గారణభూతురాండ్రగు స్త్రీజాతి నధోగతిపాలు సేయుచుంటిరా? ఇట్లుపేక్షించిన మీజిహ్వలు తృణభోజ్యపదార్థరసగ్రహణఁ జేయజాలునా? మీరు భుజించిన పదార్థంబులు జీర్ణంబు లగునా? మీ రక్తనాళములు బద్దలయి చిమ్మనగ్రోవివలె మీ ధైర్యసాహసౌదార్యైశ్వర్యాదుల వెదజిమ్మి పంచముల పాలు గావించకుండునా? వారలకు మీ రూడిగఁపుకాండ్రు గారా? ఈ పరాభవము నాకుమాత్రమా? కాదు. నాకా? పురుషజాతికా? యోచించుటకు మీ హృదయములు నాశనము లయినవా? అహా! భరతదేశమా! అమ్మా! భరతఖండమా! నీ కడుపున నెంత నీచబుద్ధి గలవార లుదయించిరి!

ఉ. భారతదేశగౌరవము ♦ పాడఱఁ గాలము వచ్చె లేసిచో
సూరిజనాళి కుంపువడి ♦ చూచుచునుండఁగ నిట్లు దుష్టసం
చారుఁడు దుస్ససేనుఁ డొక ♦ సాధ్వికురు ల్మొలివేసి యీడ్వఁగా
నోరు మెదల్ప జంకుచు న♦నుంగొనుచుందురె బొమ్మలట్లుగాన్

కౌరవవీరులారా! భరతమహాభిషక్శంతనుల నాఁటినుండియుఁ బౌరుష గౌరవంబులు గలిగి పరశురామగర్వనిర్వాపణచణుండయి భారతకేసరి యని యిప్పటి రాజచక్రంబు ముందఱఁ బేరువడసి ఫాలాక్షునైన లక్ష్యంబుఁజేయని బిరుదుమగండై కురువంశాలంకారుండగు భీష్ముం డవతరించిన గొప్పవంశంబున జనించిన మన కౌరవవీరులు తమయింటఁ జొచ్చిన క్షత్రియాంగన, శుద్ధాంతనివాసిని పరిషన్మధ్యంబున కీడ్చి తెచ్చుటా!

ఉ. దీవుల నేఁడిట న్విజయ♦దీక్ష జయించుటో వీరశౌర్యల
క్ష్మీవిభవంబునం దిదశ♦శేఖరు గెల్చుటో భూరిశక్తి వి
ద్రావితవైరులౌటో సభ ♦ ద్రౌపది నీగతి నీడ్వనెంచు ట
య్యో! విన ధార్తరాష్ట్రుల మ♦హాశయ మీభువి నిండియుండఁగన్.

ఆర్యులారా! సభలో నింతసేపు నిర్భయముగా నుపన్యసించుట స్త్రీలకుఁ దగదని తెలిసియు దురాగతాపాత్ర నారీసమయంబు గలదా యనుటచే వినువారికి విసువుగనుండిన జెప్ప నుంకించుచుంటి. పది నిముసములకాల మిందు. విద్యాధికులయి, పరాక్రమోన్నతులయి, ధర్మవిదగ్రగులయి, పౌరుషగ్రామణులయి, బలవజ్జనవిఖ్యాతులయి, ధనుర్వేదశ్రేయరులయి, వీరవరాగ్రయానులయి, పరోపకారపారీణులయి, అభయదానకంకణచణత్రాణులయి, విఖ్యాతి గాంచిన నాభర్తలు కాలవైపరీత్యముచేతనో, మత్ప్రాగ్జన్మకృతకర్మమాయావిలాసకీలికించితులగుటచేతనో, శత్రునిర్మితమాయాసాగరనిమగ్నులగుటనో, అపూర్వంబుగ భార్యను జూదంబునఁ బణంబిడి యోడిరను, సాహసంబునకాలవాలమై, బుద్ధిబలవిశేషబీజాంకురమై, జగదుత్పత్తిస్థితిలయాదులకుఁ బంటచేనయి, పురుషయశోలతలకు మూలకందమగు భార్య స్వతంత్రించి మానము కాపాడుకొనవలసిన కాలము కావునఁ బ్రాణాధికంబగు గౌరవాభిరక్షణకై క్షణకాలము నన్ను విడువుఁడు. మగవాఁడే స్వతంత్రుఁడనుకొనకుఁడు. రణప్రాంగణంబు నారీమణు లలంకరించఁగూడదని తలంచకుఁడు. మీచేతుల నుండు కత్తులే పనిచేయునని యోచింపకుఁడు. సమరంబునకు సాధ్వు లసామర్థ్య లనుకొనకుఁడు. అబలలు ప్రయోగించు బాణంబులు పురుషప్రాణములు దీయఁజాలవని యెంచకుఁడు. సభాసదుల కధర్మకళంక మంటకుండుఁగాతమని గోపాలునిం బ్రార్థించి,

మ. సతికిన్ మానము దూలువేళఁ బతియాజ్ఞం గోరకే దుష్టసం
తతి మాయించుట శాసనం బగును గాన న్వీరపత్నీకర
స్థితఖడ్గాంచితతైక్ష్ణ్యధారఁ గన సంసిద్ధుల్ ద్విరన్ రండు రా
ట్ప్రతి గొంతుల్ తెగఁగోతు లేనియెడలన్ దాస్యంబునే సల్పెదన్.

క్షత్రియులకు యుద్ధజయము లోకద్వయకీర్తిదాయకము. కావున నా భర్త జూదంబున మీ కోడిన రాజ్యంబును క్షాత్రంబుగ నేను సంపాదించుకొని రాణి నయ్యెదను. చేత కానిచో దాసినై వరవుడుతనంబు నేనెద.

భీష్మ—ఎంత దుష్కాలము సంప్రాప్తమయినది.

మ. సుదతీ! నీ వనుమాటల న్వినుచు భీష్ముం డిప్డు ప్రాణంబులన్
వదలన్ జాలకయున్నఁ జచ్చినటులే భావించు దుర్యోధనుం
డుదయం బొందిననాఁడె కౌరవకులోన్మూలంబు గావించునం
చెద నూహించిరి పెద్దలిప్పు డదియే యేతెంచె నీవాక్తతిన్.

తల్లీ! యంతఃపురాంగనలు వీరశిఖామణులయి యొనుట గౌరవసంరక్షణార్థము రణప్రాంగణంబునకుఁ బిలుచుచుండ వినియుం, చూచియుం నిర్జీవప్రతిమవలె నచలుఁడనై భవిష్యత్కాలిధర్మంబుల స్మరించుకొనుచు, మావిషాదంబు దిగమ్రింగుచు నుండవలసిన కాలము వచ్చినది. అధర్మకృతుఁ జూచుచు నిట్లు జీవించియుండుమని బ్రహ్మ మూఁడు వంతులు పెట్టి నా నుదుట వ్రాసినాఁడు. స్త్రీయుదూషితులగు ప్రభువులకడ వంశ[illegible],

మానసాకరమున నుత్పన్నములగు నీతిరత్నములు కూపాంతరపాతంబులగు మౌక్తికముల చందమున నిష్ప్రకాశములయి యరణ్యవాసులకడ నుండు కుంభిసంభవనిర్గతంబులగు ముక్తాఫలంబులవడువున నిరర్థంబులు గాక సార్థంబులగునా? సాహంకారులగు రాజులచేఁ బరిపాలితంబులగు రాజ్యములు ప్రజలకు కారాగృహములవలె బంధహేతువులు గాని బంధనిర్ముక్తసాధనములు గావు. అట్టి నిర్బంధవిముక్తి గోరిన నిప్పుడు కాదు. భవిష్యత్కాలమునందైన శాంతిని వహించిన మీవంటి సాధ్వులవలననే కాని దేశంబు శుభస్థితిలోనికి రాఁజాలదు. నీ వాగ్రహించిన మేమే కాదు లోకంబులు భస్మంబులు కావా? ఒకప్రాణి సహింపఁజాలని కష్టము లనుభవించినను పలువురు సుఖమందుట నాప్రాణికి క్షేమము గాని, ప్రారబ్ధానుగతమగు తన కష్టమునకై పరుల నిందించుట లుత్తమధర్మములు కావు. సాధ్వీ! విధివిధాన మప్రతిహతమని తలంచి ధర్మమాగసి వర్తింతువని యింతవట్టు పలికితివి. ధర్మస్వరూపుండగు ధర్మజునికన్న నీ కేడులోకంబుల ధర్మనిర్ణయంబుఁ జేయువారు కలరా? తల్లీ! యాతఁడే శకునికైతవంబున బోనుంగు వడిన చిత్తంబు గలవాఁడై దుర్యోధనగ్రస్తాభయపీడితుండై యుండ నొరులు వారెత్త గలరా? కురురాజసభాంతరాళంబున విదురున కొసంగిన నివాళిపత్త్రరంబులఁ గనుంగొని మారాడువా రెవ్వరు? ప్రాక్తనకర్మఫలంబుఁ దప్పింప నేరికి వలనుపడు? మఱియు దురభిమానగ్రస్తులగు వారు హితులహితవాక్యములకుఁ జెవియొగ్గుదురా? ప్రాణముకంటె నెక్కుడగు మానసంరక్షణార్థము స్త్రీలు స్వతంత్రించుట యధర్మము కాదని నిశ్చయముగాఁ జెప్పెదను. కాని భర్త యసామర్థ్యుఁడయిన నట్లు చేయుటయుత్తమము. నీభర్త ధర్మబద్ధుఁడయి అట్లూరకుండెను గాని యశక్తిచేఁ గాదు. భర్త సంరక్షించుచున్న ధర్మమును కాపాడుటయే భార్యకు పరమధర్మము. ప్రారబ్ధములగు కర్మలు భోగనాశనములు గాని యన్యమార్గధ్వంసితములు గావు. అజ్ఞుఁడో, యసమర్థుడో భర్తను తానినిఁ దిరస్కారముగా బలుకుటకన్న మౌనము వహించి యుంట నీవంటి యిల్లాండ్రకు శ్రేయస్కరంబు సుమా! ఇది యుపదేశించుటకాదు. జ్ఞాపకము సేయుట కా దలంపుము.

ద్రౌది—(తలవంచి మొగమున కోపము అసహ్యము చూపించుచు నిలువబడియుండును.)

కర్ణు—గడును పెండ్లాము నిల్లుండవలదు. రచ్చకెక్కి నిర్భయముగ వ్యవహారములు నడుపఁగల్గు పడఁతుల సతతము బంధనాగారముల నిర్బంధించిన పిచ్చియెత్తిన వానరములవలె బహిస్సంచారపరాయణస్వాంతలయి సమయము వచ్చిన వీధిని బడ నెంతురు. సహజముగ నీవు వీరపుత్రి వందమా? వైరికరకృపాణసాధ్వసీకృతశిరోజుండు ద్రుపదుండు లోకవిదితపరాక్రమవంతుఁడు కదా? వీరపత్ని వందమా? దూత్నిర్జితనాసులై, దురభిమానబిఫలీకృతశౌర్యులగు పాండుపంచక పట్టమహిషివి గదా? ఓసీ! పాంచాలీ! దూరీకృతాభిమానవై, నిరంకుశసాహసప్రకటనపాండిత్యనిపుణవై, సభాస్థలంబున నాట్యంబుసల్పు నటకాంగనవలె, త్రిప్పుకొనుచు మహాంకాళివలె కేకలు వేయుచు, ఖడ్గము పట్టెదనన్నమాత్రమున నే కూరాగ్రేసరులు దిగులొంది బెదరనిద్ధుంచితివికాబోలు!

ఓ! పంచభర్తృకీ! హతాచ్ఛిద్ధతాస్యమనోవ్యథచే పరిషద్రంగ మనుమాట మఱచి వీరవరుల నూదవిద్యావిశారదులుగా నెంచి నిర్లజ్జత్వముగా మాటలాడసాగితివి. లజ్జాకరము. పాపము నీ వాక్యములు నీ భర్తను మఱింత పౌరుషహీనునిగాఁ జేయుచున్నవి.

మ. వెరపా? లజ్జయు? మానమా? తగవ? గంభీరప్రలాపంబులా?
పరధర్మార్థవిచారణంబ? సభలా? వాక్యార్థమా? యుద్ధమా?
తరుణీ! భారతదేశగౌరవము దగ్ధంబంద నిట్లాడెదే
కురురాడ్భ్యమిధవుండె భర్త యగు నీకున్ నిక్కపు శాతోదరీ!

పాపము పిఱుగువంటి దాస్యవ్యాపారము నీ తలపై నిడిన భర్తలపై జూపఁదగు వ్యావహారపారుష్య మీ సభాసదులపై జూపించి దుఃఖమును శమింపఁజేసికొన నెంచితివి గాఁబోలును. నీతోడ రణవ్యాపార మొనరింప దుర్గోదరనిర్జితసాహంకారులగు పాండవుల కన్న వినిర్గతమందాత్ము లెవ్వరు? ద్రోణశిష్యాగ్రియాయుధు లయిన భీమార్జునులనే రమ్మనుము. పరువడితనంబునకు నడుము బిగించుకొని దాసి పనులచేఁ గత్తి బట్టుట కధికారము లేదుగాని, సమ్మార్జనీమూలంబు గ్రహియించి పరాగచయంబులపై పరాక్రమంబుఁ జూపింపుము యువరాజా! వెనుకంజవేయుచున్నా వేమి?

దుశ్శా—ఓసి! పశువా! దాసివై యుండి రాజపోకడలు మానక తెగనిపై కారు అఱచుచుంటివి. నీ శాపనాకారములకు జంకి, నిన్ను విడుచు పందలిం దెవ్వరును లేరు. నీవు సత్యవాణివైన నీకీ యెదురుగను మగలవ్రేత యేమి? నీ కీగతి యేల పట్టును? మానహీనులయి నీ మగలు ద్యూతమున నోడి నిన్ను మా స్వాధీన మొనర్చిరి. నిన్ను వివస్త్రను జేసిన నడ్డుపడు మగవానినిఁ జూపుము? నీకు దిక్కు గలిగినఁ జెప్పుకొనుము. మయసభాభవనమున మా దుర్యోధనసార్వభౌమునిఁ జూచి నవ్విన చిలుకనవ్వును సభాసదులు చూచెదరు. మఱియొకమా జెప్పెదు నవ్వుము. పౌరుషము గల మగవాఁడు తనులయెదుట భార్యను పరాభవించుచుండ, ధర్మము ధర్మమని యోర్చుకొను మగవాఁ డుండునా? పౌరుషహీనుల చెట్టఁబట్టిన మగువగతి యింతదిగా నెఱింగి దేవుఁడు నీ మొగమున బహుభర్తృకవు గమ్మని వ్రాసినాఁడు. నీ కర్మ బాగుగా నుండిన నొక్క పౌరుషవంతు నాశ్రయించుము.

భీమ—(కోపముతో) ఆర్యులారా! కురువృద్ధులారా! నిరంతర సత్యనిష్ఠాగరిష్ఠుండగు యుధిష్ఠిరసోదరుఁడగు భీముండు పలుకు పలుకులు సావధానులై యాలింపుఁడు. ఈ యంధనృపాలాధిష్ఠితంబైన సభాంతరాళంబున జరుగుచున్న మహాఘోరపాతకంబుఁ జూచి మైమరచుటచే నింద్రియంబు లస్వాధీనంబులయి మానసము దుఃఖాక్రాంత [illegible] ధానంబున ధర్మాతిక్రమణం బొనరించినఁ బెద్దలు నన్ను క్షమింతురను నమ్మకమున నింతదనుక యుధిష్ఠిరాజ్ఞాపాశబద్ధుండనయ్యాను, జనుపరాభవ సరీక్షణకోపాగ్ని శిత్షణి విక్షేపమాత్రజ్వాలాక్షిప్తుఁ డగుభీముఁడు, గర్వోద్ధతుండను ఆగ్రిజాజ్ఞాలాన బంధంబు పెకల్చుకొని విడఁబడి సాహసంబు జూపుచున్నాఁడు.

ఉ. అన్న సహింపఁజాలను మ♦హోగ్రహవేగము ధర్మపద్ధతుల్
మన్నయిపోవనీ మఱియు ♦ మండని నుండని లేకపోవనీ
కన్నులఁ జూచి భార్య నొక ♦ కష్టుఁడు బట్టలు విప్పుచుండ భీ
మన్న సహించునే రిపుని ♦ మాడ్చఁడె వానిని మంటఁ గల్పడే?

ఆహా! యేమి కాలవిపర్యాసము. ఏమహాసాధ్వి పతివ్రతాకులాలంకారయై మధ్యమలోకజనంబులకు ప్రాతఃకాలస్మరణీయులగు సాధ్వీలలామములలో గణియింపఁబడెనో, ఏయపాంసులాశిరోమణి వేదమంత్రహుతహవ్యవహనోద్భవయై, యయోనిజయై జగంబుల ఖ్యాతిఁగాంచెనో, ఏసతీరత్నంబు పాండవపంచకపరివేష్టితయై, అసూర్యంపశ్యయై దిగ్విజయపరాక్రమోపార్జితభూపాల శిరోలసిత కిరీటకోటిఘటిత రత్నమరీచిభూషిత పాదారవిందయై ప్రకాశించెనో, ఏ యువతీరత్నంబు రమారమణ పాదారవిందాక్రాంతమనీషయై చెలంగెనో, ఆపతివ్రతాతిలకము, ఆవీరపత్ని, ఆవిద్విట్కాలరాత్రి, ఆవిదుషీమణి, ఆర్తయై, అనాథయై విలపించుచుండ,

ఉ. ఆ వనజాననం గురుస♦భాస్థలమందు గ్రహించి రాజసూ
యావభృథంబునందు వసు♦ధామరమంత్రపవిత్ర వారిధా
రావళి చేసి పావనము♦లైన శిరోజములన్ గ్రహించి పా
పావహుఁ డీడ్చె నిచ్చెను భ♦యంకరవృత్తిని జూచియుంటిరే!

వాతవేగాపధూతంబయిన పతాకవలె దుశ్శాసనాకృష్టవేణియై, విషణ్ణయై, కోపలజ్జాపరవశయై, అగతికయైన భార్యను జూచి యూరకుండు పురుషుండు నికృష్టుండు గావున దుశ్శాసనకంఠగళరక్తపానం బొనరించుచున్నాఁడు. (అని యెగురుచున్నాఁడు.)

ధర్మ—(భీముని పట్టుకొని యాపుచున్నాఁడు.)

భీము—భవదాదృతధర్మోపదేశార్గళంబు రిపువధోద్యోగవిస్మృతమానసుండనైన నన్నడ్డుచున్నది గావునఁ గాలనిరీక్షణ మపేక్షించి ప్రతినఁ జేసెద వినుండు.

మ. కురువృద్ధుల్ గురువృద్ధబాంధవులు నే♦కుల్ చూచుచుండంగ న్మదో
ద్ధురుఁడై ద్రౌపది నిట్లు చేసిన ఖలుం ♦ దుశ్శాసనున్ లోకభీ
కరలీల న్వధియించి తద్విపులవ♦క్షశ్శైలరక్తౌఘముని
ర్ఝర ముర్వీపతి సూచుచుండ నని నా♦స్వాదింతు నుగ్రాకృతిన్.

ఉ. కొట్టెద బొమ్మ బ్రద్దలుగ ♦ గుండెలు కండలతోడఁ బండ్లచేఁ
బట్టి పెకల్చి రక్తమును ♦ పానము సేసెద లోని ప్రేవులన్
జుట్టెదఁ గంఠమాలగ స♦భ్యుల గనువారల కద్భుతంబుగాఁ
బట్టి రణాంగణంబునను ♦ పాతకరక్తము మేనఁ బూసెదన్.

రక్షఃకులపాంసనుండగు హిరణ్యకశిపుని భీకరకరజానఖరనిర్గళితజ్వాలాభీలుండగు నృసింహుండు నఖాగ్రముల వక్షఃకవాటంబు బద్దలు చేసినట్లు, ద్రౌపదీకేశాంబరాకర్షణ మహాపాతకిం బట్టి హృదయకవాట నిర్భేదనం బొనర్చి, రక్తమును పంచదారపానకమువలె బొట్టనిండఁ బట్టించెద. అల్పజలాశయంబున, నీచులగు బెస్తలు జల్లిచేపల దేవినట్లు దుశ్శాసనోదరంబు గదాఘాతంబునఁ గుళ్ళగించి మాంసఖండంబులం గలసిన రక్తంబు కాశ్మీరదేశాగతకుంకుమపంకిలంబగు చందనంబు పగిది నా మెయినిండఁ బట్టించెద. దుష్ట దురాగత దుశ్శీలులగు కౌరవసోదరులు ఆరాజు దుర్యోధనసార్వభౌముండు చూచుచుండ మహాసాధ్వీశిరోజాకర్షణాశివృత్తుండగు యువరాజాధమున్బట్టి యీగదచే పంచాస్యంబు మదగంధసింధురకుంభంబువడువున వీని తల పక్కున పగులఁగొట్టెద. ఇందులకుం దప్పినఁ బితృపితామహుల గతికిం దప్పినవాఁడను. గురుజనావధీరితసంజాత పాపలోకంబుల కేగువాఁడ. మఱియు నో ద్రౌపదీ! వెఱవకు. క్రోధావేశంబున మఱచితి. ఇటు వినుము.

ఉ. ముడువను నీదు వేణి నిఁక మూర్ఖుని, ♦ నీచుని, దుస్ససేను భీ
ముఁడను వధియించి రక్తముఁ ♦ ద్రాగించిన చేతుల నీశిరోజముల్
వడివడి జిక్కుఁదీసి ముడువంగల ♦ ధీరుఁడు చూడు మాటఁ ద
ప్పఁడు సతి' ధర్మజాజ్ఞ నిటు ♦ వ్యర్థముగాఁ గనుపట్టె నీకు డై.

దుశ్శా — అశక్తదుర్గ్రవాక్యంబుల కలుక సహింపరాదు. నాపనిలో నేను జాగరూకుఁడ నయ్యెద. అర్థశూన్యంబులు వ్యర్థఫలంబులుగదా యున్మత్తప్రలాపంబులు? ఓసి దాసీ! రా! (అని వస్త్రము నూడఁదీయ లాగుచున్నాఁడు.)

ద్రౌప — (వస్త్రమును పట్టుకొనుచు విచారముతో) ఆహా! తుదకు నాయవస్థ విషమస్థితిఁ జేరెను. సభ్యులుపేక్షించిరి. భర్తలా కాలనిర్దిష్టబలాహంకారులైరి. భీష్ముం డంతటివాఁడు దుష్టరాజానను నొక్కఁ జెప్పఁజాలక నన్నే మందలించుటకై ప్రారంభించినాఁడు. ఇప్పుడు నేను పతివ్రత నగుదునా? కానా? సందేహమేల? నా వ్రతమును పూర్తిగా నాచరించుటలేదా? లోప మొనరించితినా? లోప మొనరించకుంటినేని, యా సతీధర్మమే నాకు శరణ్యము. ఇంక నాకు వేరు దిక్కేల? యుద్ధమేల? ఈ సభ్యులతో ప్రసంగమేల? ధర్మము వేదచోదితమై, వేదము సత్యమై, జగన్నాటక మాయాయవనికాంతరవర్తియగు పరమాత్మయే శ్రీకృష్ణుండయిన, ధర్మముననే సూర్యచంద్రాదులు తిరుగుచుండినఁ, బంచభూతసంచయవ్యాపారములు ధర్మముననే జరుగుచుండిన నట్టి ధర్మరాశిలో నొక్కటియైన సతీవ్రత మాచరించుచున్న నన్నీ మూర్ఖులు, ఈ కుహనాస్వరూపులు, ఈ దయాశూన్యులు, ఈ నీచు లొనరించు పరాభవమున నాప్రాణమానములకు నీవత్యాత్మత్రము వైపరీత్యము సంభవించిన సూర్యచంద్రాదుల గమనంబులు వ్యత్యస్తములు కావా? భూమ్యాకాశము లేకమయి నన్ను మూంచివేయవా? గిరులు సపక్షంబులై యెగిరి నాతలపైఁ బడవా? మారుతుండు స్వస్వరూపంబును గొని నన్ను లోకాంతరంబు నేర్పఁడా? సప్తజిహ్వుండు తీవ్రజ్వాలలం బరపి నన్ను

యున్నాఁడా? సకలప్రాణిహృదయాంతర్వర్తియై, సంసారసాగరతరణోపాయతరణియై, ఆర్తత్రాణపరాయణుఁడై, అనాథజనరక్షణుండగు విశేషించి నాకు సోదరుండయిన శ్రీకృష్ణుఁ డుపేక్షించునా? కృష్ణా! భర్తృపాదసేవయే పరమైశ్వర్యంబుగాఁ దలఁచి మనోనాథుని పాదతీర్థమె గంగాతోయంబుగా నూహించి. పతిసందర్శనంబె పరబ్రహ్మ దర్శనంబుగ భావించి. యాత్మనాథు సుఖదుఃఖంబులు నాసుఖదుఃఖంబులుగా నెంచి జీవితేశుని వాక్యంబులు వేదవాక్యంబులుగా స్మరించి, రేయుంబవళ్ళు తలచునప్పుడు, చెప్పునప్పుడు, చేయునపుడు పతిసేవాపరాయణురాలవయితినేని దుర్మదాంధుల సాహసిక వ్యాపారంబులు లోకపాలురు భస్మములు కావా? పుణ్యలోకంబు లల్లాడవా? బ్రహ్మాండములు ద్రొర్లవా? సూర్యుఁడు సద్యోదయ స్తమింపఁడా? యమలోకంబు వడంకదా? సుమ్మూర్తులు పసిపాపలు కారా? శత్రువులు నశించరా? శ్రీమహావిష్ణు వవతారంబు లెత్తఁడా? ఇట్టి విపరీతంబులు సృజించిన పతివ్రతల పేరులు నాశనములు కావా? ఈ దురాత్ముఁడు, నాకు దిక్కుగలదేని చూచుకొమ్మనిగదా వస్త్రము లాగుచున్నాఁడు. మామకీనహృదయాంతర్వర్తియగు పరమాత్మ శ్రీకృష్ణుఁడు భగవానుఁడే దిక్కు. భక్తపరాధీనుండు దిక్కుఁగాఁడా?

మ. బలవంతుల్ గుణవంతు లార్యజనసే♦వాతంత్రమర్మజ్ఞని
స్తులధీమంతులు వైరివీరకులసం♦స్తోమాంతకాభు ల్పతుల్
చలమూనన్ దమభాగధేయము సభన్ ♦ జాయాపణద్యూతనం
చలితాత్మార్థవిగర్హులైరి గను కృ♦ష్ణా! దీనసంరక్షణా!

మ. ఎవరిం జేరఁగనేర్తు రక్షకులు నా ♦ కేరీ దయంబ్రోవ ది
క్కెవ రీఘోరపరాభవార్తులకు నె♦ట్లే దప్పుదున్ జాలిదా
ల్పవె కాపాడవె దుఃఖమార్పవె దయ ♦ న్బాలింపవే దీనబాం
ధవ! యార్తావన! ద్వారకానిలయ! ♦ కృష్ణా! దీనసంరక్షణా!

మ. ఖలుఁ డీవేళ సభాంతరాళమున వీఁ♦క న్బట్టి నా కట్టుబ
ట్టల విప్పం జతనంబు సల్పు నృపసంత ♦ న్మౌనస్థగా లేక భ
ర్తలు భీష్మాదులు చూచుచుండి రిట నా♦ర్తత్రాణపారీణ చె
ల్లెలు దుఃఖాబ్ధి మునింగె, నీవదిని జా♦లిం గొల్పు కృష్ణా! హరీ!

శా. హాకృష్ణా! జగదేకబంధు! సదయా ♦ యార్తార్తినిర్వాపణా!
లోకారాధ్య! మహాప్రభూ! నతదయా♦ళూ! దీనమందారమా!
నీకన్నన్ గతి లేదు ద్రౌపది మహా♦నీచస్థితిం జెందె వే
సాకన్ గమ్ము దయాబ్ధి! ద్వారకపురీ♦సంస్థాన! కృష్ణా! హరీ!

శ్లో॥ నందాదిగోపజనమందార మంతరిత కుందాభిమాల్యనికరం
మందాకినీసలిల బృందాభిరూపిత సునందాస్యమ్యైకచరణం
బృందారక ప్రముఖ సందారితారిఘనబృందాటవీదహనం
వందే కృపాబ్ధి తవ పాదారవింద లసదానందపాంసుపటలం.

ఏమి, నాకు దిక్కు గలిగినఁ జెప్పకొనవలయునా! ఓయి! నాపాతివ్రత్యమే నాకు దిక్కు. అంతకన్న బలమగు దిక్కు గలదా? అది చాలదా? చూడు నీవు వ్యర్థఫలుండ వయ్యెదవు.

మ. హరియో శంకరుఁడో విరించియొ సుధా♦హారాధినాథుండొ యి
ర్జగములో సూర్యుఁడో చంద్రుఁడో యెవరో వ♦స్త్రంబక్షయంబంచు ని
త్తఱి నామానము గావరాకో దురా♦త్మా విప్పెదో వస్త్రముల్
నెరవా సాధ్వికి నీకు చేతనగునా ♦ విప్పంగ నావస్త్రముల్?

మ. సతినై కృష్ణపదాబ్జభృంగమతినై ♦ సత్యవ్రతాచారసం
గతినై భర్తృమనోనుకూలగతినై ♦ కాపట్యరాహిత్యస
త్స్థితినై యుండిన యేని ద్వారకపురీ♦వాసుండు శ్రీకృష్ణుఁ డీ
స్థితి నామానము గాన నక్షయములౌ ♦ చీర ల్వడిన్ బంపఁడే.

శా. పాతివ్రత్యము ధర్మమై యదియు నే ♦ పాలించుటే సత్యమై
చేతం జెప్ప మనోధవార్చనకథా♦సిద్ధాంతకల్లోలినీ
యాతాయాతరహస్యవీచికల నే♦య్యం బొప్ప దూఁగాడు వి
ఖ్యాతింగాంచిన నే వివస్త్రనయినం ♦ గర్గోలుగా వే భువుల్.

(అని విస్మృతిఁ జెందుచున్నది.)

దుశ్శా — (కొన్ని బట్టలువిప్పి) ఓసిదాసీ! ఇందునకా పాత్రిగామిని నాలుగు మారులు తిప్పినది. గుడ్డపై గుడ్డ కట్టుకొనుటకా! నీమాత్రపు గారడితనము తెలియని వా రెవరు? ఘూర్ణితలసదరిక్రమమాంసలభుజార్గళుం డగు దుశ్శాసనుండు వస్త్రములు విప్పఁజాలక పోవఁడు. ఎన్ని బట్టలు కట్టితివో చూచెద.

ద్రౌపది — నావస్త్రమును హరించుచుంటివా? హా! దయామయా! నామస్మరణమాత్రభస్మీకృతపాపసంచయా! అయోనిజనై, వీరపుత్రినై, వీరమాతనై, ధీరవీరపత్నినై, భవత్పాదారవిందార్పితమానసనైన నాకీ కష్టకాలంబున, నీ చూడుపడుచు సభాంతరాళంబున మానభంగము నొందుచుండఁ గాపాడవా? ఓ నందనందనా! మానము — ప్రాణము — ఖరాధవము — ఖరాధవమా — (అని నిశ్చేష్టితు జాలగుచున్నది.)

దుశ్శా — నీ ప్రార్థనలకు దేవుఁడు దిగివచ్చుచున్నాఁడు (అని విప్పుచున్నాఁడు)

కర్ణ—ఓీ యదృష్టహీనురాలా! నీ యిడుములు కనులారఁ జూచినకొలఁది నా మనము మిగుల ఖేదము నొందుచున్నది. గొప్పయింటిబిడ్డవు. సిరి గలదానవు పాప మా గాండీవిచేఁ బరాభవింపఁబడిన నీతండ్రి తన మానసంరక్షణార్థ మీపాండవుల నల్లుండ్రఁ జేసికొనఁ దలఁచి నిన్ను ద్యూతనిర్జితదాసులగు మానహీనుల కంటఁగట్టినాఁడుగాని, నీ రూపరేఖావిలాసములకు, నీ ధైర్యసాహసములకు, నీ నేర్పరితనమునకు నయిదుగురు భర్తల వరించుటకంటె సార్వభౌమ రాజాధిరాజ బిరుదాంకుఁడై, శూర వీర మిత్రమండలుఁడై, సకల సంపదలచేత భూలోక దేవేంద్రుఁడై, ద్యూతమున నిన్నుఁ బందెము వెట్టక తా నోడక శత్రువైభవముల నోడించికొనిన రాజచూడామణి నొక్కరిని భర్తగా వరించుట పట్టపుదేవిగా నుండుట నీకు క్షేమము సుమా. సభాంతరాళమున క్షత్రియాంగన స్వతంత్రించి వివాహమాడుటకు ధర్మశాస్త్రము లనుజ్ఞ నొసంగినవికదా.

దుర్యో—(ద్రౌపదికిఁ దనతొడపైఁ గూర్చుండుమని సంజ్ఞఁజేయుచున్నాఁడు)

భీము—(కన్నులెఱ్ఱసేయుచుఁ జూచి) ఓరి మాయాద్యూతసమాగతద్రవిణమదాంధ! కౌరవాధమా! అగ్రజాజ్ఞాబద్ధులయిన భీమాదుల నశక్తులుగా నెంచి నీ వొనరించుచున్న నిష్ఠురంపుచేష్ట లనిష్టంబు నీ కొసంగునని స్పష్టముగా నమ్ముము. సభాసదులారా! అధర్మావలోకనకుతూహలస్వాంతుండగు గుడ్డిరాజుకడ నిర్భయంబుగ దుష్టవ్యాపారపరాయణుండగు సుయోధననాథముంగూర్చి వీరసింహాంశగు భీముండు వలుకు ప్రతిజ్ఞ నాలింపుఁడు. ఇట్టి ప్రతిన మీ రెన్నఁడు వినియుండరు. ఇకముందు వినఁబోరు. మఱియు నీ ప్రతిన భూతకాలవీరులకు సహపాఠియై, అధునాతనవీరకేసరిశిరఃకిరీటాలంకారమై, భవిష్యద్భారతవీరుల కాచార్యరూపంబై, ఆతతాయిశూరులకు భయంకరంబై, శత్రుప్రతాపాగ్ని ప్రజ్వలనంబై, పౌరుషోత్సాహకరంబై యొప్పుచుండుఁగావున, దత్తావధానులు గండు. వినుండు. న్యాయపథానువర్తినియై నందనందనపాదార్పితహృదయాబ్జాతయై ధర్మవిశేషపుంజీకృతనవీనాకృతియై సభాంతరాళప్రకటీకృతసాధ్వీధర్మవిభవాభిరామయై చెన్నారు పాంచాలిని, అయోనిజను, అసూర్యంపశ్యను. న్యాయసభనిర్భయంబుగ ధర్మప్రసన్నిధానంబున అధమకులసంజాతప్రబోధంబున రాజశబ్దమాత్రధీభూతచిత్తుండయి పాండవపట్టమహిషిని తన తొడపైఁ గూర్చుండుమని కనుగీటుచు నంకాస్ఫాలన మొనర్చు దుర్యోధను నాయోధనంబున నెల్లరు చూచుచుండ

మ. కపటద్యూతసమాగతద్రవిణ♦దుష్కాదంబరీపానమ
త్తపరాధీనత ద్రౌపదిన్ గురువుపై ♦ దార్పంగ యత్నించు నా
* కుపితోత్సంగ మురాతిసంతవిదళ♦త్కోష్ణస్రవద్రక్తస
ల్లపితోగ్రాగ్రగదాభిఘాతముల జీ♦ల్కల్ సేతు నే నాజిలోన్.

---

* (కటటోత్సంగమురాతికంఠదళనోత్కంఠోష్ణ)

గురుభక్తికలవాడవు. కావున నీ కుపదేశింప నా మన ముత్సహింపుచున్నది. అగ్రజాజ్ఞ నాదరింపుము.

భీము__(అసహ్యముతోఁ దలవంచుకొని చలికిలబడుచున్నాఁడు.)

గాంధా... నాయనా! విదురా! నీ ప్రభువునకు సవిస్తరముగ నీవిషయముఁ దెలియఁజేయుము.

విదు...(ధృతరాష్ట్రుని సమీపించి) మహాప్రభూ! పాండవరాజసూయవైభవ సందర్శనసంజనితామయాక్రాంతుఁడగు దుర్యోధనుఁడు మాయాద్యూతమునెపంబున ద్రౌపది నోడించికొని సభాంతరాళమున వివస్త్రంజేయు దుశ్శాసనుండు నడుముకట్టుకొని సుయోధన రాధేయానుమతంబున వలువ లొలుచుచుండుకతంబున భీవదగ్నిహోత్ర జ్వాలలు నక్కులకు నివాసంబయ్యె. అగ్నులు చల్లారినవి. ఉత్పాతంబు లుద్భవిల్లినవి. ఇంక వంశక్షేమము పుత్రుని ప్రాణరక్షణము జేయుభారము దేవరయధీనమయియున్నది.

ధృత... నా యుపేక్షయే యింత తెచ్చినది. నాయనా! సుయోధనా!

చ. పరమపతివ్రతన్ సభఁ ♦ దపస్విని పాండవధర్మపత్ని ధ
ర్మరత నయోనిజం బ్రకృతి♦మానవభామినిగాఁ దలంచి యే
ప్పరములు వల్కఁగాఁదగునె ♦ బాల్యమునాదిగ మిట్టిపాపనం
బెట్టఁగితి నీ నిమిత్తమునఁ ♦ బెద్దయు దుఃఖితులైరి పాండవుల్.

నాయనా! పలుమారు విదురనీతి యాధారముగ నడుపుమను నా నుడువులఁ బెడచెవి నిడి కులమున కుపద్రవంబు తెచ్చిపెట్టికొంటివి. ఇంకనైన ధర్మాత్ములగు పాండవులపై దురాగ్రహంబు మానుము. సకల బాంధవహితంబుగ నేఁ జేయుట దలంచినదాని కంగీకరించుము. నిత్యము ప్రాతఃకాలంబున వంద్యురాలగు నీ వధూటికకు నమస్కరించి పాపములం బాపికొనుము. విదురా! అమ్మాయిని పాంచాలిని నిటు పిలువుము.

దుర్యో__(అసహ్యముతోఁ దొలఁగిపోవును.)

గాం... ఏది కోడలు?

విదు...(ద్రౌపదిని సమీపించి) సాధ్వీ!

ద్రౌప__(గాంధారిని సమీపించవలయు.)

గాం__అమ్మా! పాంచాలి?

విదు... అదిగో! పాదాభివందనమొనర్పఁ బూనుచున్నది.

గాం__(లేచి ద్రౌపదిని కౌఁగిలించుకొని) అమ్మా! సతీమణీ! నావంటి పెద్ద దానిచెంత నా... దడఁబుచున్న [illegible] చుము. లోకంబున గల స్త్రీజనంబులకెల్లఁ దలకట్టుగు పాతివ్రత్యమహిమ[illegible]నంబుఁ బ్రకటించిన నీ పవిత్రశరీరమును కౌఁగిలించుకొనినమ్మా. మావంశమును దహింపఁజేయుటకు నవతరించిన శ్రీమహాలక్ష్మివి. నీ పాదోదకము సకలసీమంతినీసీమంతధారణాభాగ్యంబు. నీదర్శనంబు సమస్తపాపక్షయంబు. నీ నుడి బ్రహ్మస్వరూపంబు; నిన్ను

స్పృశించినఁ బాపాత్ముల పాపంబులు నాశనంబులగును. నీ కపకార మొనరించిన దురాత్ముల పాపంబులు, నీ కరుణాకటాక్షవీక్షణప్రసారము లేనిది యెన్నటికిని నశింప నేరవు. ఇటురమ్మా. (అని ధృతరాష్ట్రుని సమీపమునకు దీసికొని పోవలయును.)

ద్రౌప—పాండవపట్టమహిషి, కురుకుమారపరాభవీభూత, ద్రౌపది నమస్కరించుచున్నది. (అని నమస్కరించవలయును.)

ధృత—అమ్మాయి! నీవు నా కోడండ్రయందుఁ బూజనీయురాలవు, నా కోడళ్ల జెప్పనేల? స్త్రీసముదాయములకెల్ల వందనీయవు తల్లీ! స్త్రీల కన నేల? పుణ్యులగు పురుషులకెల్ల స్మరణీయసుగుణగణ్యవు. కావున నుపేక్షాదోషమున నేఁ జేసిన నా నేరము సైచి "పితృవన్మాతృజ్యేష్ఠః" యను న్యాయంబున జ్యేష్ఠుని యిల్లాలవుగావున, నీ మఱందులగు సుయోధనాదుల కుమారులుగా భావించి వారలపైఁ గోపంబు మానుగా సైపుము. సాధ్వీ! నీకుఁ బ్రియంబు సేసెద. నీయిష్ట మెద్దియో వేడుము.

ద్రౌప—మహాప్రభూ! యీ సేవకురాలు తమ యాశీర్వచనపాత్రురాలుగాని నుగ్రహపాత్రురాలు కాదు. ధర్మమే జనకుని నమ్మికనదానను. దయచే నాకు వరము ప్రసాదించఁ దలంచితిరేని, దయామయులు తమరు గావున మునినిభుండై, ధర్మస్వరూపుండైన ధర్మరాజునకు దాస్యంబుఁ బాపవలయును. ప్రభువు లట్లు కటాక్షించిన నహంకారాభిమానులగు సుయోధనాదులు కుమతులు లగుటలేమి కలిగిన ప్రతివింధ్యుని దాసపుత్రుండనరాదు. ఇదియ నాయభీష్టంబు.

ధృత—అమ్మాయి! అట్లొసంగితి; రెండవవరము వేఁడుము.

ద్రౌప—భూపాలతిలకా! దయాస్వరూప! నాయభీష్టితంబు నెఱవేర్పఁ దలంచితిరేని, యుధిష్ఠిర సహోదరులు తమ యాయుధములతోను, వస్త్రసమూహములతోను, స్వాతంత్ర్యులు కావలయును.

ధృత—సాధ్వీ! నీకోరినవరంబు లొసగితి నింక మూఁడవ వరంబు వేఁడుము.

ద్రౌప—దయాస్వరూపులగు తా మెన్నిదైన వరంబు లొసంగ సమర్థులు. కాని కోరుటకు నా కధికారము లేదు. కోమటిజాతియందుద్భవించిన సాధ్వికి నొక్కవరమును, క్షత్రియాంగనకు రెండువరములును, శూద్రజాతిసతికి మూఁడువరంబులును బ్రాహ్మణసతికి నూఱువరంబులను వేఁడ నధికారము కలదు. కావున నెక్కువ కోరఁజాలను.

ధృత—మహాధర్మస్వరూపురాల వగు నీకుం దెలియని ధర్మరహస్యంబులు కలవా? నీసుగుణములకు మెచ్చితిని. నీవు కోరకయే వరంబు లిచ్చెద. నాయనా! యుధిష్ఠిర! సోదరసహితుండవై యొకపరి యిటు రమ్మా.

పాండ—(పాండవులు వచ్చి ధృతరాష్ట్రునకు నమస్కరించవలయును.)

ధృత—అబ్బాయి! ధర్మనందనా! నీవు సదావృద్ధోపసేవివి. ఎల్లధర్మములు నీవ యెఱుంగుదువు. తెలియక నీ కెగ్గుచేసిన నా కుమారుల నేరము సైపుము. ఉత్తమ

పురుషుండు పరుల నేరములఁ దలంపకుంటయు, ఓర్పు కలిగియుంటయు, గుణంబుల గ్రహించి దోసంబుల విడుచుటయు సహజముగాఁ గలిగియుండును. ఉత్తమగుణావలంబ మండవగు నీవు క్రోధము మనంబునఁ జేరనీయవు. కావున ననుజసహితుండవై స్వరాజ్యంబు గొని సకల సంపదలతోఁ దులఁదూగుచు నెప్పటియట్ల నిండ్రప్రస్థపురంబున కరిగి సుఖంబుండుము. ఏను వెనుకముందు యోచింపక జూదం బుపేక్షించితి. అల్పబుద్ధి నత్యుండనయి వృద్ధుండనైన నన్నును మీ తల్లియైన గాంధారిని దలంచి, దుర్యోధనాదులు సేసిన దుర్ణయంబులఁ దలఁపకుండునది. సర్వశాస్త్రవిదుండయిన విదురుఁడు మంత్రిగా సర్వధర్మవిదుండవయిన నీవును రక్షకులయిన, నీకురుకులంబు క్షేమంబుగా నుండును. వంశము కాపాడుభారము నీయది, నీకొండుకోరిక కల్గిన గోరుము.

ధర్మ—తండ్రిగారికోరిక దీర్చుటయె నాయభీష్టంబు. రాజులు దాయాదద్వేషము మాని యన్యోన్యప్రియులై సతులు సాధ్వులై వంశములకును దేశములకును శుభములు సమకూర్చి పతివ్రతామహిమాభిరామలయి యుండునట్లాశీర్వదింపుడు. లోకజాలంబు శుభంబుగా నుండుటయె నాయభీష్టము. పాపము శాంతించుగాక! శుభములు వర్ధిల్లుగాత!!

సంపూర్ణము



# సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

## చరిత్రాత్మక స్టేజీ నాటకములు

| ఒక్కొక్కటి ధర | | రు. అ. |
|---|---|---|
| రసపుత్రవిజయం | ఇ. య. | 1-2 |
| రాణాప్రతాప్‌సింగ్ | డిటో | 1-0 |
| చంద్రగుప్త | సం. శి. | 1-4 |
| ఖిల్జీ రాజ్యపతనము | గు. వేం. | 1-12 |
| దుర్గాదాసు | జం. శి. | 2-0 |
| రాణాప్రతాపసింహ | డిటో | 1-4 |
| బొబ్బిలియుద్ధము | శ్రీ. కృ. | 1-0 |
| నానాఫడ్నవీస | ము. సు. | 1-0 |
| భక్తమీరాబాయి | కే. రా. | 1-2 |
| అనార్కలి | ఉ. స. | 0-12 |
| ఛత్రపతిశివాజి | డిటో | 1-0 |
| చండిక | ము. వే. | 1-8 |
| ధరణికోట | సో. రా. | 1-8 |
| ప్రతాపరుద్రీయము | డిటో | 1-8 |
| తాజమహల్ | డిటో | 1-8 |
| నూర్జహాన్ రోజా | భో. నా. | 1-0 |
| శంభాజీనిర్యాణం | శ్రీ. కా. | 1-0 |
| శివాజీ శీలము | డిటో | 1-0 |
| రోషనార | కొ. సు. | 1-0 |
| ఆంధ్ర వాణీసామ్రాజ్య మను శ్రీకృష్ణదేవ రాయలు | పో. సు. | 1-0 |
| మహారాష్ట్రవిజయం | చ. మా. | 1-0 |
| రంగరాయ కదన మను బొబ్బిలియుద్ధము | కా. సాం. | 0-12 |

## ఆంధ్ర నాటకములు

| ఒక్కొక్కటి ధర | | రు. అ. |
|---|---|---|
| ప్రతాపాగ్నీయము | కో. శ్రీ. | 1-4 |
| చంద్రగిరాభ్యుదయం | డిటో | 1-4 |
| చిత్రనళీయము | ధ. కృ. | 1-12 |
| విషాదసారంగధర | డిటో | 1-13 |
| పాదుకాపట్టాభిషేకము | డిటో | 1-8 |
| చంద్రహాస | డిటో | 1-8 |
| ప్రమీలార్జునీయము | డిటో | 1-4 |
| ప్రహ్లాద | డిటో | 1-4 |
| మోహినీరుక్మాంగద | డిటో | 1-4 |
| సావిత్రి చిత్రాశ్వము | డిటో | 1-4 |
| బృహన్నల | డిటో | 1-4 |
| పాంచాలి స్వయంవరం | డిటో | 1-4 |
| ముక్తావళి | డిటో | 1-4 |
| చిరకారి | డిటో | 1-4 |
| పత్నీప్రతాప్ అను అనసూయ | సో. అ. | 1-4 |
| పద్మవ్యూహము | కా. నా. | 1-4 |
| చిత్రాభ్యుదయ మను సారంగధర | కా. నా. | 1-0 |
| విద్యారణ్యము | దం. వేం | 0-8 |
| కిషోరి | సూ. పా. | 1-0 |
| శాకుంతల | కం. పీ. | 1-0 |
| బిల్వమంగళ | శ్రీ. కా. | 1-0 |
| లీలావతి సులోచనలు | | 1-0 |
| మాధవాచార్య విద్యారణ్య | | 1-0 |

# సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

## సాంఘిక స్టేజీ నాటకములు

| ఒక్కొక్కటి ధర | | రు. అ. |
|---|---|---|
| లోభి | పా. వి. | 1-8 |
| తెలుగుతల్లి | వే. వేం. | 1-8 |
| కష్టకాలము | డిటో | 1-8 |
| ఆకలిమంట | డిటో | 1-8 |
| పతితపావన | తాం. వేం. | 1-4 |
| విడాకులా? | గు. నా. | 1-8 |
| ఆంధ్రజ్యోతి | డిటో | 1-8 |
| లేడీడాక్టరు | కా. హ. | 1-4 |
| కాలేజీగరల్ | డిటో | 1-0 |
| ముద్రిక | పా. ల. | 1-0 |
| విచిత్రవివాహం | డిటో | 1-0 |
| రాతిస్తంభము | డిటో | 1-0 |
| చింతామణి | కా. నా. | 1-8 |
| మధుసేవ | డిటో | 1-8 |
| వరవిక్రయం | డిటో | 1-8 |
| భక్త చొకామేళ | మ. అ. | 1-4 |
| రంగూన్ మెయిల్ | సూ. పా. | 1-4 |
| రంగూన్ రౌడీ | సో. రా. | 1-8 |
| జయంతజయపాలం | ఆ. స. | 1-0 |
| విడోమ్యారేజ్ | కొ. ల. | 1-0 |
| సరిపడని సంగతులు | టి. రా. | 1-4 |
| వాల్మీకి | కా. గో. | 1-2 |
| అభినవ సరస్వతి లేక నవనాగరికత | మ. పా. | 1-0 |
| సుదినము | రా. వేం. | 0-12 |

| ఒక్కొక్కటి ధర | | రు. అ. |
|---|---|---|
| కన్యాశుల్కము | గు. అ. | 1-8 |
| నేటిగిరీశము | బి. స. | 0-8 |
| టీకప్పులో తుపాన్ | ముద్దుకృష్ణ | 0-8 |
| సానికొంప | పె. ప్ర. | 0-12 |
| ప్రేమలీల | సు. వెం. | 1-8 |
| మధుకల్లోలము | ఆ. హ. | 1-0 |
| పిసినిగొట్టు | శ్రీ. కా. | 0-8 |
| కొత్తల్లుడు | డిటో | 0-8 |
| ఏకిచ్ ప్యాలా (ఒకపెగ్) | | 1-4 |
| పునర్వివాహము | డిటో | 1-4 |
| చిత్తవృత్తి | డిటో | 1-0 |
| భారత రమణి | డిటో | 1-4 |
| తగినశాస్తి | డిటో | 1-0 |
| వృద్ధవివాహము | గో. వెం. | 0-12 |
| తెనాలి రామకృష్ణ | చిం. సో. | 0-12 |
| చిద్విలాసము (త్యాగి) | | 0-12 |
| ప్రేమసమాధి | క. జ. | 1-0 |
| కలియుగదర్పణము | డిటో | 1-0 |
| సోమయాజి | డిటో | 1-0 |
| పునస్సంధానశుల్కం | అ. శే. | 1-0 |
| పుండరీక | అ. సో. | 1-0 |
| రసికాభిరాముడు | వా. వెం. | 1-0 |
| సుగుణమణి | వ. బా. | 0-10 |
| సినిమాగరల్ | దా. వేం. | 1-0 |
| రేవతి | మా. అ. | 1-4 |

స్వకీయ శ్రీ సరస్వతీ ముద్రాక్షరశాలయందు ముద్రితము.